## రా మా య ణ ము.

చ. ఘనగుణశాలి ప్రాణమునకంటెఁ బ్రియుం డగురామచంద్రునిన్
జనసుతు నొంటిఁ బంపి నిమిషం బయినన్ మనఁజాల వంశవ
ర్ధనుఁ డగునట్టి యీతలిరుఁ బ్రాయపుముద్దులకుఱ్ఱఁ డేల నీ
యనుమతి నేన వచ్చెద సురారులఁ జంపి మఖంబు గావఁగన్. బాలకాం.

ఉ. చంద్రరువంకి నెమ్మొగము చాఁగెడుకన్నులు వృత్తదంష్ట్రముల్
సుందరపల్లవాధరము సొగసరు ల్మణికుండలప్రభా
బంధురకర్ణయుగ్మమును బారెఁడుచేతులుఁ గల్గురాము నిం
పొందఁగఁ జూడకున్న నిలుపోపఁ దరంబెసుమంత్రయుక్తికిన్. అయో.

చ. ఇనకిరణాళికిం జొరవ యీక సదాగతిరాకకైనఁ బ
ల్చనపడ కర్థిసైకతముఁ జల్లిన రాలఁగనీక దట్టమై
దనుజవిముక్తకాండములఁ దట్టుచు దిక్కుల రామకాండముల్
సునిసితభంగిఁ నిండుటయుఁ జూచి సురల్వెఱఁగందిరయ్యెడన్. అరణ్య.

ఉ. భూవరవర్య యెవ్వని సముద్ధతిఁ జాపుటకై కడంగి సు
గ్రీవునితోడ నెయ్య మొనరించి తదీప్సితసిద్ధిఁ గోరి న
న్నీవిధిఁ బంపి తట్టిదనుజేంద్రుని రావణుఁ గీటడంచి నీ
దేవిని నెందుడాఁచినను దెచ్చియొసంగనెయొక్కప్రవేల్మిడిన్. కిష్కింధా

ఉ. ఓరిదురాత్మ యిందు బుధు లుండరొ యుండిన నీవు వారలం
జేరవొ సాధువాక్యములు చేకొన నొల్లవొ శిక్షలేమి నా
చారవిహీనమై సకలసజ్జనగర్హిత మయ్యె నీమతం
బారయ నీకతంబున నిశాటకులంబు చెడు న్నిజంబుగన్. సుందరకాం.

మ. మరియుం రావణి సాయకంబులు ధనుర్మౌర్విం దగంగూర్చి బ
ల్గరులాడం దెగనిండఁదీసి వెస వక్షం బుచ్చిపో నేసినన్
గురుబాణక్షతజాతరక్తకలితాంగుండై సుమిత్రాసుతుం
డరయం బొల్చె విధూమవహ్నిగతిఁ బుష్పాఢ్యద్రుమప్రక్రియన్.

యుద్ధకాం.

## జన్మ ఖండము.

చ. సలలితశుద్ధతోయములు చారుమణీదళపద్మకైరవో
త్పలములు గంధలుబ్ధకసుకాననుమత్తగీతనాదముల్
కలరవచక్రకుక్కుటమరాళమనోహరమంజుశబ్దముల్
గలిగి మనోజ్ఞసంపదలఁ గ్రాలు విశాలసరోవరం బొగిన్. ఆ. ౩.

మ. పరికింపం గడు దుర్లభం బవనిలోఁ బ్రాణేశ కాంతామణీ
పురుషప్రేమగుణాతిరిక్తమనిశంబుం బూతచారిత్రయుక్
స్మరసారజ్ఞయు సాధ్వియున్ రసికయున్ జాతుర్యసంయుక్తయా
తరుణీరత్న మెఱుంగు సత్పురుషుఁడున్ దథ్యంబుచింతింపఁగన్. ఆ.౮

## శిశుపాలవధము.

శా. సామర్థ్యంబున మాఱులేనిబల మన్యాయం బన్విధి న్నీతిమి
ద్యామర్యాద నెఱింగి పోవుబల మస్యం బిట్టు లీరెంటికిన్
నేమం బేర్పడ భూరితేజమునకుం జీఁకట్లకుంబోలె బ
ల్గామానాధికరణ్య మెట్లు గలుగున్ జర్చింప లోకంబునన్. ఆ. ౧.

చ. అలఘుధనుష్ప్రభావము గుణాతిమహత్త్వము ముష్టిశక్తియో
యిలయు దిగంతముల్ గగన మీనుచు నున్నవొ నేమిచిత్రమో
తెలియఁగరాదు శౌరిసముదీర్ణశరంబులు చిత్రజల్లుల
ట్లలవడ నొక్కరీతిఁ గురియం దొడఁగెన్ ధ్వనిపూర్వకంబుగన్. ఆ. ౪.

## భగవద్గీత

ఉ. మెండుగ వృష్టికాలమున మిన్నకపాఱునదీప్రవాహముల్
నిండి చలింపకున్న యలనీరధిఁ జేరినమాడ్కి నెవ్వనిం
దండిగ సర్వకామములు తప్పకచేరు నతండు శాంతుఁడై
యుండు సకాముఁడై సనరుఁ డొందఁడు శాంతిని బాండునందనా.

చ. అలయక యోగు లీతనిఁ బ్రయత్నము సేయుచు నాత్మయందు ని
శ్చలముగ నున్నవానిఁగ [illegible] రజ్ఞులై పని
శ్చలమతిహీను [illegible] జాలఁ బ్రయత్నము చేసియున్ సము
జ్జ్వలుఁ డగునీశ్వరుం దెలియఁ జాలరు భారత [illegible] మింతయున్.